## ౧౦ పరిపాత్రములు

సహదేవుఁడు

శిశుపాలుఁడు

భీష్ముఁడు

ధర్మరాజు

భీముఁడు

అర్జునుఁడు

నకులుఁడు

నారదుఁడు

శ్రీకృష్ణుఁడు

నందికేశ్వరుఁడు

ఓం

శ్రీమత్పరదేవతాయైనమః

# పాండవ రాజసూయము



## ప్రస్తావన

చ. సరసుఁడు నాగభూషణుఁడు చారుతరా ప్రతిమానగాత్రభా
స్వరుఁ డురుగాననాట్యముఖసర్వకళానిలయుండు భూతివి
స్ఫురితుఁ డమాయికుండు నిజబోధసుధామయుఁ డొప్పుచుండు శ్రీ
హరి పరిచింతనామృతసమర్పితన్నై జమనః ప్రచారుఁడై.

మ. అనుసంధ్యమ్మున నాతఁ డాడు సుమనోహస్తధ్వనుల్ పెల్లుగాఁ
దనకున్ భృంగిముఖుల్ సహాయులుగ సాంద్రంబై నయానందమున్
గనువారల్ భజీయింప నాత్మతనుభాగస్థాయి సర్వప్రజం
బును గీతామృతసారసంపదలచేఁ బోషించి రక్షించుచున్.

ఉ. ఆతఁడు నాట్యమాడు సమయమ్మున కయ్యెడ కేగుదెంతు రి ప్ర
ఖ్యాతులు మౌనితల్లజులు గణ్యులు సిద్ధులు సాధ్యు లప్సర
శ్శీతకరాననల్ మొదలు; సేవకు నట్లరుదెంచు వారి సం
ప్రీతమనస్కులన్ సలుపు శ్రీహరిఁ బాడుచు నాతఁ డాడుచున్.

ఉ. అశ్వపుధాటియో! జలధరార్భటియో! యనుభంగి భృంగి వి
శ్వేశ్వరుఁ "డౌను, మే"! లనుచు నెంతయు మెచ్చ మృదంగమూని తా
విశ్వవిచిత్రవాద్యమున వేడ్క ఘటింపఁగ నాగభూషణుం
డీశ్వరుఁ డాడి పాడునఁట! యే రల సౌరు నుతింపనేర్తురో!

తే. గీ. ఇట్టు లనుసంధ్యమును నాట్య మెలమి సలిపి
ముక్తి ప్రత్యక్ష మొనరించు మూర్తియౌట
నితరదైవతములకన్న నితని నెల్ల
సుమనసులు వచ్చి సేవింపఁ జూచుచుంద్రు.

చ. జరిగె ననంతకాల మిటు స్వాదుతరా ప్రతిమానగానమా
ధురియును దాండవంబు గడుఁదోరముగాఁ గనువారి మానసాం
తరముల నాటికో; నతనితత్త్వ మెఱుంగని వారుగూడ వ
త్తురు కనిపోయి రంభఁ బతితోఁ నతఁ డాడుచుఁ బాడుచుండఁగన్.

వ॥ అమ్మహాదేవుం డిట్లనుసంధ్యంబును శ్రీహరి భక్తితత్పరత్వమ్మునఁ దన విద్యాతిశయమ్ము సఫలమ్మొనర్చుచుఁ దాండవానంతరమ్మున నొకట సభాస్తారులం గాంచి యిట్లనియె.

శా. ఈ నిండోలగ మోలిమై వినుత మే నిష్ఠాఢువాక్యమ్ము లు
త్థానైకాదశి వచ్చుచున్నది హరిన్ దత్కాలమం దర్చనా
ధీనుంజేసినవారల న్నిరతమున్ దివ్యన్మహావైభవా
నూనాముత్రపరత్ర సౌఖ్యములు చెందున్, డింయి సర్వాఘముల్.

శా. ఇందన్కన్ శయనించియున్న హరి నాఁ డీక్షించు నందమ్ము లా
కందమ్ముల్వికసింపఁజేసి జన మా కంజాక్షు నావేళ వా
నంద మ్ముప్పతిలన్ యజించుట ది సంధానించుఁ బున్నెంపుఁ ది
న్నెం దైవారఁగఁజాలుభాగ్యము నమందీభూత సామ్రాజ్యమున్.

క. తులసీబృందావనమున
వలఘున్ లక్ష్మిసవాధు హరిదినమున బూ
జలు కార్తికమునఁ జేసెడి
సలలితమతిశాలి కొక్క సౌఖ్యము కాదవే!

శా. నేనేమో పరతత్త్వ మంచుమదిలో నిక్కమ్ము మీరెల్లరున్
ధ్యానిం, త్రామహనీయు నేఁ గొలుతు నిత్యమ్మున్; మహాభాగుఁ డా
శ్రీనాధుండు మదీయనాట్యకలనాసేవ్యం దెఱుంగుండు వి
జ్ఞానాంభోనిధి యాతఁ; డాతనికిని చ్ఛల్ పూజపేయందగున్.

మ. ప్రతిసంవత్సర కార్తికమ్మనను దత్పాదాంబుజమ్ముల్ సుమ
ప్రతతిన్ నే యజియింతుఁగాని "యిటుసల్పంబోలు" నంచున్ భవ

న్మతి కెక్కఁగ బచియింపలే దెపుడు, సమ్మానింపఁ డీయేఁడు స
త్కృతులన్ శ్రీహరి నుత్సవాదులఁ గడున్ దేదీప్యమానమ్ముగన్.

వ॥ నావుడుఁ బరమభక్తులగు సభాసదులు కరమ్ములు మొగిచి యిట్లనిరి. స్వామీ! యేము మీ యందుంబలె శ్రీహరియందును భక్తులము, తదారాధనమ్మునకై యింత నొక్కి సెలవీయంబనిలేదు; తప్పక యట్లు యొనరించెదము, కాని కొండొక విజ్ఞాప్యంబు గల దయ్యది యాలింపం బ్రార్థించెదము. కార్తికై కాదశినాఁడు స్వామిమేల్కాంచు రనికదా! సెలవిచ్చితిరి, వారేదినమ్మున నెచట శయనించి యుండి రదియు నా శయనమ్ము నకున్ గతమ్మును వచించి మా మనమ్ముల నిస్సంశయము లొనర్పవలయు నాఁగ నాగభూషణుం డిట్లను.

క. వినుఁ డాషాఢైకాదశి
నవఘుఁ డతఁడు బోధమూర్తి యహితల్పమునన్
వననిధిని యోగనిద్రన్
గొని విద్యాస్ఫూర్తి మెఱయఁ గొమరారుఁ జుఁడీ!

క. కార్తికశుద్ధైకాదశి
నార్తిహరుం డతఁడు త్రిభువనావనదీక్షా
స్ఫూర్తిఁ మేల్కను, సువ్రత
వర్తుల కానాఁడు మిగులఁ బావన మరయన్.

ఉ. కావున నాఁటి పూజ త్రిజగమ్ముల కే నెఱిఁగింప నెంచి స
ద్భావులరైన మీ కడ ముదమ్మున నేఁడు వచించితిన్, మహా
ధీవిభవుండు శ్రీకరుఁడు దివ్యమహోమహితుండు మీదు సం
భావన కర్హుఁ, డే నెఱుఁగు వట్టును దెల్పితి నట్లొనర్పుఁడీ!

చ. అనవుడుఁ దత్సభాసదులు హస్తము లెత్తిరి, యెల్లవారు మే
లనిరి "సెబాస్సెబా" యనుచు నాడిరి పాడిరి. యేమిచెప్ప! నా
ఘనుల హాళాహాళుల్; పిదపఁ గాలగళం దల వారి శ్రద్ధకున్.
మనమున మెచ్చుచున్ మరల మాట యెదో వినఁబడ్డ యట్లుగై.

మ. "ఎవఁడా బుస్సలుకొట్టు నాతఁ?" డని తా నెల్లన్ విలోకించి యం
దెవఁడున్ గానఁగరామి ఱిచ్చవడి మో మేమాత్రమో వంచున
ష్టవలోకించె నిజాంగసంగతు నహిన్ బ్రారబ్ధకోపానల
స్ఫవిరాస్యుల్ నయనాంతరుద్గళదమందస్ఫారదావానలున్.

క. అప్పగిది నున్న యంగపు
సప్పమ్మున్ గాంచి హయఁడు జాడ్యపరీతం
బిప్పా మా హరిపూజకు
నొప్పనిగతి దోఁచుచున్న దూహింపంగన్.

వ. అని యద్దానితో నిట్లనియె.

క. ఉమ్మలిక మిట్టులో నా
గమ్మా! నీకేల కలిగెఁగడు రోజెదు బల్
చెమ్మటలు గ్రమ్మ సారెకు
"హూ"మ్మని బుసఁగొట్టె దేటికో చెప్పుమనన్.

శా. ఆనాగ మ్మిటు చెప్పఁగాఁదొడఁగె, దేవా! శ్రీహరిన్ మీరు పూ
జానైవేద్యమహోత్సవాదుల నవశ్యమ్మున్ యజింపంగ ను
త్థానైకాదశి వచ్చుచున్నదనుచున్ దద్దన్ బ్రసంగించు నా
యీనాదున్ వినినంత నాదొదవె నెంతే నాదు శీర్షమ్మునన్.

ఉ. ఏమని యందురేని యతఁ డెంతయుఁ బూజ్యుఁడె యౌనుగాక, వి
ద్యామహనీయు లెల్లరును నర్చితుఁగా నొనరింత్రుగాక, మా
కామయసంవిధాత యతఁ, డక్కట తనన్ హరిపూజ కొప్పఁగాఁ
బోము, భవత్సమీపమునఁ బొచ్చెము మాని వచింతు నింతయున్.

క. హరి నాగభూషణులకున్
బరస్పరము మైత్రియనియు బాగుగ నా యం
తర మెఱుఁగు, నైన మాకా
హరిసైఁపఁడు కాళియాహి నడఁచిన కతనన్.

శా. మా చుట్టంబగు కాళియాహిశిరమున్ మర్దించుటే కాక నా
ట్యాచార్యత్వ మదెల్లనయ్యెడలనే వ్యాపింపఁగాఁజేసి "పో
నీచా! యీ యమునానదిన్ విడిచి, ర్రమందింతున్ జుమీ! యెన్నఁడే
నీచెంతన్ గనరాకుమీ" యనునె! మమ్మెన్నిం గనంబోలదే!

తే.గీ. బురదతొాస్పోట నటు సరిపోయెఁగాని
మా యురగజాతి నింకొక్క మహితుఁడేని
పాదతాడనముల నట్లు పడియు శీర్ష
మెత్తి బ్రిదుకునె? యటుమీఁద నేమియైన.

చ. అతని శిరమ్ముపైని హరియంఘ్రులు నిల్పి నటించెఁ గానిప
ద్ధతి, యది మాకు నెల్లరకు నాతనికెంబలె సంఘటించె; శీ
ర్షతలము చూడుమా కడు భరమ్ముగఁ దత్పదయుగ్మ మెట్లు ము
ద్రితమయి యొప్పుచున్నదియొ తెల్లము నాగులకెల్ల నల్లఁగన్.

చ. అనవుడు నాగభూషణుని కక్షిగనుండిన సూర్యుఁ డెంతయున్
గనలియు లోనడంచికొని క్రమవచొ విభవం బెలర్ప ని
ట్లను, నిది గొప్ప తప్పసుమి! యాహరి మీకొలమం దొకానొకం
డనఁదగువానికిన్ సలుపు నాయపకార మిటన్ గణించుటల్.

చ. ఎవనికిఁగాని యెన్నఁడును నెవ్వఁ డసత్కృతి నేయకుండు వాఁ
డవని వినంబడండ, యపుడప్పు డటుల్ ఘటియించువాని క
ట్లవమతి వాఁడొనర్చుటకునై పలుహేతువు లుండితీరు, నా
యవమతి జాతికంతకును నబ్బినయట్లు తలంపఁగూడు నే?

క. అది కారణముగఁ బుణ్యా
స్పదమగు సత్కృతికి నడ్డు సల్పి వృథా దు
ర్మదము వెలార్చుట తగునే?
సవగ్రిణుల వొల్చునట్టి సదములయందుఁ.

క. ఇప్పగిది హరుని యంగపు
సప్పమ్మను మందలించె సత్సేవ్యండై

యొప్పారు సూర్యుఁడింకొక
సప్పము తలయె త్తిఅంతు సలుపకయుండఁ.

మ. హరుఁ డాశ్చర్యపరీతుఁడై మనమునం "దౌరౌర ! యేపాటి దీ
యురగంపుంబురు వట్టి శ్రీహరి కరిత్వోద్రేకియై యింతగా
నఱవన్ సాహస మెట్లుగల్గు? నిట సాహాయ్యంబు వేఱొక్క తెం
పరితోలో నొనరించి దీని కిటు జల్పాకత్వమున్ గూర్చెడిన్.

ఉ. అట్టి పరిబుద్ధుఁ డిం దెవఁ" డటంచుఁ గనుంగొన వీరభద్రు మో
మట్టి కళంకమున్ తెలుపునట్టిదియై కనుపట్టె, శూలి య
ప్పట్టున దివ్యదృష్టిఁగని "భద్రి"ఁడదే మొదలంతరంగమున్
బెట్టఁడు విష్ణుపై; మిగుల ద్వేషమె చూపఁగడంగు నిచ్చలున్.

ఉ. దక్షుని దుర్మదాంధ్యము వదల్పఁగ వీఁడొక స్వేదజంబుగా
నాక్షణమందు నా హృదయమందలి తీవ్రతఁబట్టి పుట్టెఁ, ద
చ్ఛిక్షకు నేగి యయ్యెడల శిష్టుల గూడఁబరాభవించెఁ, బ
ద్మేక్షణుఁగూడ వీఁడచట నిం చుకయున్ గణియింపఁ డక్కటా?

ఉ. ఆతఁడు నన్నుఁజూచి కడునగ్గలపున్ రుష నాఁగి వీని దు
ర్నీతికి సైఁచె, నా సయిచునేరుపు వీఁ డెఱుఁగండు బొత్తిగాఁ,
"గాతరుఁ డాతఁ"డంచు మదిఁ గన్గొని తన్మహిమానుభావ వి
ఖ్యాతులు లెక్కపెట్టక నికార మొనర్పఁగనెంచు మూర్ఖతన్.

తే.గీ. ఈయనాత్మజ్ఞుఁ డెప్పుడో యీ సరీసృ
పమ్ములకుఁ జేసె దుర్బోధ చనవు మిగిలి
ఇవి ననుంగూడ లెక్కింప కిందునొకని
బైకి లేపి పేరిలించు దుర్భాషణములు.

ఉ. ఏనఁట ! చెప్పువాఁడనఁట ! యెల్లజగమ్ముల నేలు శ్రీహరిన్
ధ్యానమొనర్పుఁ డం; చది సదస్సఖిలమ్మునకున్ హితంబఁ ట
ద్దానికి నస్మదంగమునఁ దాల్చిన నాగమొకండు వారకం
బౌనఁట ! యింతకన్నఁ గలదా ! యిల దారుణసాహసం బహో !

తే. గీ. వీరభద్రుం బొకెంచుక ప్రేరణంబు
చేసెనే యమ్మ హరిపయి సీసువతన,
నంతమాత్రిన నామాట కడ్డు చెప్పఁ
దలఁచుపాటిదె యీ హాలాహలపుఁబురువు."

చ. అని తనయంశమై హరికె సర్పగొనర్చె తదీయతత్త్వమె
ల్ల నెఱిఁగి దీర్ఘజీవియగులాగున దీవనగాంచి పొల్చు నా
హసుమయు గానమున్ వినఁగ నమ్యోడనుండు మెఱింగి "చెప్పుమో
యనఘ ! హరింగురెంచి మనయజ్ఞుల తిక్కలడంగు ముచ్చటల్."

మ. హనుమంతుం డడియాలకెంచి "వినుఁడయ్యా సర్పరాజుల్ ! మహో
ఘనుఁ డాతం డొకనాఁడు మున్నతని మీర్గట్టఁ బ్రయత్నించి పం
టినకిన్కన్ దనుజేంద్రపుత్రికుఁ డొగిన్ బ్రేరేపఁగా మూఁగి వి
చ్చినదిన్ జచ్చినదిన్ సమస్తమును నేఁ జెంతన్ విలోకించితిన్.

ఉ. అంతన 'సర్పజాతిపయి నాహరికెన్ గన' లంచు మీరు మీ
స్వాంతములన్ దలంచు టది చాలఁ బ్రమాద; మెవండుగాని దు
శ్చింతత నొడ్లకుఁ జెఱుపుచేసెడి జంతువులఁ సహింపఁ, డే
మంతు వెఱుంగకుండిన యమాయికులన్ వధియింపఁడెమ్మెయిన్.

శా. మీలో నుత్తము లెందఱో కలరు నెమ్మిన్ వారిఁ బూజింపదే !
పూలుంబత్తిరి గూర్చి లోకము: జగంబున్ దుగ్రంగఁగాఁ జేయు దు
శ్శీలమ్ముం గలవారినో, లగుడముల్ చేఁబూని మర్దింపఁగా
నాలోచించుచునుందు రెమ్మెయిని దా మాబాలగోపాలమున్.

క. కావున గోపాలుండటు
మీవానిన్ గాళియున్ క్షమింపమి తప్పే!
యావిష్ణువు దుష్టుల నిం
కేవారిన్ సైఁచె ? మీర లెఱుఁగరె నాగుల్ !

తే. గీ. శిష్టరక్షణమును దుష్టశిక్షణంబు
నతని కృత్యమ్ములగుట మీయందె కాదు ;

ఎవరియందేని దుష్టుల నేరి శిక్ష
సేయు, శిష్టుల నెలమిఁగై సేసి ప్రోచు.

ఉ. "వాలిని జంపె నాతి" డని నాలముగల్గిన యస్మదాదు లా
శ్రీలలనామనోహరుని నేవను దూఱుటలేదు, వాలి దు
శ్శీలము వాలిజీవము నశింపఁగఁజేసెనె కాని యాతనిన్
గూళతనాన రాఘవుఁడు గూల్పఁడు, ప్రాజ్ఞులు మీరెఱుంగరే?

శా. మీజాతిన్ గడుఁబ్రాజ్ఞు లెందఱో మహామేరు ప్రకాశుల్ గలా
రోజన్ వ్యాకరణంపు భాష్యము నెవండో కాదు మీచుట్టమే
రాజద్భోగసహస్రవాగ్గ హరి పర్వంజేసి నిర్మించె, మీ
యీజాడ్యస్మృతిఁ జాలకించునెడ "హీ హీ". యంచుగర్హింపఁడే?

ఉ. ప్రాజ్ఞత లేనివా లితరప్రాజ్ఞులువోలెఁ బలల్ గదల్చుచున్
విజ్ఞులు సెప్పు వాక్యములు వేగిరపాటున నవ్వుచుందు, ర
ల్పజ్ఞత కిద్దియేగుఱుతు; భావిసమస్త మెఱుంగునట్టి స
ర్వజ్ఞుని మాట 'కా' దనఁగవచ్చునె? యించుక జ్ఞానమున్నచో.

తే. గీ. జ్ఞానిలక్షదుర్విదగ్ధతా భీనులైన
మిమ్ముఁబోలుటి యల్పజ్ఞు లహమ్మపూని
పల్కు దుష్కార్యములఁజేసి జాతికెల్ల
వచ్చు నయశంబు, ప్రాజ్ఞులవలనఁ బోదు.

మ. హరిమీలో నెవఁడో యొకానొకని మాద్యచ్ఛీర్షు మర్దించి మేల్
తెరువున్ జూపిన యంత నాతనిపయిన్ ద్వేషించి దూషింతురే?
సరి లెం, డింతయు మీ భుజంగపతి తాఁజర్చింపలేఁ డొక్క! త
చ్చరణమ్ముల్ భజియించు నిచ్చలును దచ్ఛయ్యాకృతిన్ బొందుచున్.

ఉ. అల్లభుజంగరాట్టునకు నంతర మొండదె మీకు సుంత; మీ
యుల్లములందుఁ జూచికొనుఁ, డూరక శ్రీహరిపై నవాచ్యపుం
బ్రల్లదముల్ లిఖింపకుఁడు, భావభవారి వచించుచొప్పు సం
ధిల్లు ముదమ్ముతో వినుఁడు, ధృష్టతమానుఁడు, పూనుఁ డీనుడుల్."

ఉ. నావుడు మున్ను రేచు నల నాగ మిటుల్ వచియించె, "జాతిపో
సేవగ నెప్పుఁడో యొకని కెప్పుఁడొ తా నపకారిగాఁ బర
భావము తక్కువారలకుఁ బట్టదటంటివి, మున్నొకండు భూ
దేవుఁడు నీవు నల్పు నుపదేశ మెఱుంగక పుమ్మ మోఁదఁడే?

శా. ఏదో కొండొక నాగమాతని సతిన్ హింసింపఁగాఁ జచ్చి యా
మీఁదన్ దత్సతి చల్లఁగా బ్రతికె, నామేరేనిఁ జింతింప కా
భూదేవుండు వధింపఁగా దొడఁగె మమ్ముంబోట్ల నెల్లన్ బొరిన్;
వేదాంగమ్ములు వేదముల్ చదివి యవ్విప్రుండు నప్రాజ్ఞుఁడే?

ఉ. ఒకనికతాన నార్తిమెయి యుల్లము మండి మదీయజాతి కం
తకు నతఁ డెట్లు శత్రువయి తజ్ఞత ముందు చరించె నట్లయే
యొకని నికార ముల్లముల నూనెద మెల్లర; మూని యాహరి
ప్రకటతరాంఘ్రిపూజలకుఁ బాల్పడ, మిందొక దోసముండునే?"

చ. ఇటు కటురీతిగాఁ బెనఁగు నిట్టలపుం జెడుపాము సేయు దూ
రటనము సభ్యులెల్లరు భరమ్ముగ రోసిరి, వాయుసూతి యు
త్కటరుషఁ డయ్యె, నయ్యెడలఁ గాలగళుండు నిజాశ్రితాళిలం
పటహృదయుండు భక్తజనమంతు నివారణశీలుడిట్లనున్:

చ. సతతపురాణసూరిజన సమ్మతికిం గుఱుతైన ఫక్కి మీ
కెతఁ డుపదేశమున్ సలిపె నీహనుమంతుఁ, డమంతుభావనం
గతిఁ జనుటొప్పు, సర్వజనకాలుని నీ వనినట్టి విప్రునిన్
క్షితిసురుఁ డొక్కరుం "డిటులు సేయుటతప్ప" ని మందలింపఁడే!

ఉ. కావున నా యుదాహృతినిగైకొని కాళియుఁబట్టి మీర లా
శ్రీవరుపై దురాగ్రహము చేకొని మ్రిందుట చెడ్డతప్పు, లో
కావనశీలుఁ డాహరి మహామహిమంబు నెఱుంగశక్యమే?
మీవలెఁ దప్పుత్రోవలకు మేకొను దుర్విషజాతి కెమ్మెయిన్."

తే. గీ. అంత ఖండితముగఁ జెప్ప హరుని గూడఁ
జనవునంజేసి యాసర్పజుఁడు గణన

సల్పకే మేమొ మ్రోఁగుచు జాతికెల్ల
మచ్చరముగల్గఁజేయు నమ్మాడ్కి నుండె.

క. అంత హనుమంతుఁ డను "నో
మంతుహరా ! సాంబ ! నీదు మహనీయకృపా
దంతురితైశ్వర్యధురా
వంతము లీపాము లురక పంగుసె ? నుడులన్.

శా. ప్రత్యక్షమ్మనఁగాని లోఁగ రిల నప్రాజ్ఞుల్ ; హరిం దూటి యో
కాత్యాయన్యధినాథ ! కీడ్వడిన వేడ్కల్ దృశ్యమౌ నట్లుగాఁ
బ్రత్యేకించి ప్రదర్శనం బొనరుపం బ్రాల్మాలుటల్ మాని యీ
వ్యత్యస్తోక్తులు వీడి బాగుపడి సంభావింతు రయ్యచ్యుతున్."

ఉ. "ఔ ! నది బాగు బా !" గనియె నాహనుమంతుని మాటకున్ శివుం
డా నగజామనోహరుని యంతరమున్ గనిపెట్టి వెంటనే
ఢీనిధి నందికేశ్వరుఁడు తెయ్యితకత్తక యంచు మద్దెల
ధ్వానమొనర్చె దిగ్గజవితానము గుండెలు గూడ ఝల్లనన్.

ఉ. నాంది పఠించె సూచనఁ గనంబఱచెన్ శిశుపాల దుర్వచః
క్రందనముల్ వినంబడినకైవడి సభ్యులకెల్లఁ దోఁచె న
స్పందయశుండు ధర్మజుఁడు శౌరికి నర్ఘ్యమొసంగు సత్కథా
చందనవల్లికాకుసుమసౌరభసారభరంబు వెల్వడెన్.

(ఇది ప్రస్తావన)

ఓం

శ్రీమత్పరదేవతాయైనమః

# పాండవ రాజసూయము



(అంత సహదేవుఁడు సాట్టహాసముగాఁ బ్రవేశించును)

సహ—(శ్రుతి నభినయించి)

శా. వామం బీచరణంబు వానితలపై వర్తింపఁగాఁజేయుఁ దా
నీమై నీసహదేవుఁ డెవ్వఁడు వృథా హేయమ్ములన్ గూసి స
ర్వామేయున్ జగదీడ్యు గోపతిని సత్యాలంబి సర్వప్రదా
నామాన్యుండని పేర్కొనో మరల సవ్యాజాంత రంగమ్ముతో.

శిశుపాలుఁడు—(ప్రవేశించి సవైలక్ష్యస్మితముతో)

మ. మరలన్ జెప్పినఁగాని నీ చెవులకున్ మామాట విస్పష్టమై
చొరఁ బోదాకొ! సురాపగాసుతుబలెన్ జూపుల్ చెవుల్ నీకు మం
ధరభావంబు వహించెనోటు! మరలన్ వాక్రుత్తు నట్లేని, నీ
చరణం బెట్టిదొ చూఁపు! నీచ రణనాసారంబు వారించెదన్.

సహ—(సక్రోధాట్టహాసముతో)

మ. మరలన్ బ్రేలుమటంటి ప్రేలుము జగన్మాన్యున్ మునీడ్వంద్యు న
ధ్వరరూపున్ హరి నేతదన్యునిగ; నీతప్పం బ్రలాపమ్ము రూ
పఱ నీమస్తక మస్మదీయ చరణధ్వస్తమ్ము గావించి నిన్
బురికొల్పన్ బ్రియమొంచు రాజులకు నుద్బోధింతు సద్బుద్ధులన్.

శిశు—(కొండొకసమీపించి)

మ. ఇదిగోఁ జక్కఁగ విన్ము చెప్పెదను, మీ రీనిండు పేరోలగం
బెద నింతేని గణింప కొక్క చెనఁటిన్ హీనున్ దురాచారు దు

ర్మమ గోపాలకు నగ్రిపూజ్యునిగ సంభావించినా రిప్పు, దే
ముదితొక్కో వచియించు మాటలపయిన్ మోమోటమున్ జూపుచున్.

క. మరలన్ జెప్పెద నిట్టుల్
మరలన్ మరలఁ వచింతు మరల వచింతున్
మరలన్ మరలన్ మరలన్
మరలన్. వచియింతు నీదుమగఁటిమి గంపున్.

సహ—(తీవ్రకోపముతో నెడమకాలి పైకెత్తి కుడికాలితోఁ బోవుచు)

మ. ఇదె నీనాలుక చీల్తు, నిద్దిగొ శిరం బీకాల మర్దింతు, చు
ర్మదమాటింతు,మఱొక్కపూజ్యునెవఁడున్ మందుండిటుల్ ప్రేలుటల్
వదలింతున్ దులువా! యటే నిలువు నీవాచాలకత్వ ము్మదే
తుదముట్టింతు, జగజ్జనార్చితుఁడు నింద్యుఁడెట్టు లోతుంటరీ!

(అంత ధర్మజాది పాండవులును భీష్ముఁడును బ్రివేశింతురు)

ధర్మ—(సహదేవుని మధ్యేమార్గమున నాపి నెమ్మదిగా)

ఉ. ఎంతయు శాంతభావమున కిక్కవునాఁదగు నీకు నింతగా
స్వాంతము మార్పు చెందుటకు శౌరినిరాకరణంబు హేతువౌ
టెంతు; నటేనియున్ మనకుఁ నెందుకు గోపము పిల్చినట్టి భూ
కాంతులమీఁద, వారొ కటఁ గష్టపు దుష్కృథ మూనిరేనియున్.

తమ్ముఁడా ! వా రతిథులు, మన మాతిథేయులము. కావున శాంతింపుము. (శిశుపాలుదిక్కై) రాజవరా! నాయీమాట లాలింపుము.

ఆ.వె. సకలధర్మవేది జాహ్నవీ పుత్రుని
యనుమతమునఁజేసి యర్ఘ్య మచ్యు
తున కొసంగినార మనఘ ! యెందులకయ్య
యురక దూఱఁదొడఁగి తోర్పువిడిచి.

శిశు—(ఎక్కసక్కెముగా)

ఉ. పాండుసుతాళి గొల్లనికి సత్కృతిఁ జెప్పెడి భీష్ము తెల్వి; నీ
బాలిశతా ప్రసంగమును; బార్థివులెల్లరు నిన్నుదార స
చ్ఛీలునిగా గణించి యిటఁ జేరినదానికి బుద్ధిచెప్పి, తే
గోలయు నీవొనర్చుపని కూడదు నా కెవ సమ్మతించునే!

శా. వాచాపత్తను రుక్మిణింగొనియె నన్వంచించి యీ గొల్లవాఁ
డీ చౌర్యమ్మును భీష్ముఁ డేగతిని సత్కృత్యమ్ముగాఁ జూచెనో!
ఛీ! ఛీ! యీసభ నుండఁగూడదుఁ యశశ్శ్రీమానధన్యుల్ నృపుల్
కాచంబున్ మణిగా గణింతు రిట, సత్కారం బెవం డొప్పెడిన్.

(కోపతిరస్కారములతో మరలిపోవుచు) ఓహో! మానమహితులగునో రాజకుమారులారా;

శా. జాయల్ దోయిలు బ్రహ్మవేత్తలిచటన్; సత్కార మవ్వారికే
ప్రారంభంబున నయ్యెడిన్ వదితర ప్రాజ్యావనీపాలకుల్
గా రగ్రిప్యులు, తాతగారిటుల వల్కన్ మన్మ లాలింత్రు, మీ
శూరత్వమ్ములు కాల్పనే! కవలుఁ డిచ్చోనిల్వ సిగ్గయ్యెడిన్.

(అని తొందరగా సభవిడిచి పోవుచుండఁగా)

ధర్మ—(వెంటఁజని సగౌరవముగా నాపి)

ఉ. ఏటికి దత్తఱంపడి నృపేంద్రుల కెల్లరకున్ మనమ్ములన్
గాటపుఁగోపముల్ రగులఁగా గమకించెదు నిల్వుమయ్య! యే
పాటియుఁగాఁడు కృష్ణుఁడని పల్కితి, వందునుగూర్చి యీసభా
వాటమునన్ విచారణము ప్రాజ్ఞులచే వినవచ్చు నచ్చుగన్.

నీ వాదమే ప్రాజ్ఞసమ్మతమగునేని మాయొనర్చిన తబ్బిబ్బు సవరించు కొందుము. లేదా, నీవేని యిటు లొనర్పవచ్చును. కొండొక కోప ముపశమింపుము.

భీష్మ—(సమందస్మితక్రోధముతో) ధర్మజా! యేమిటి కవ్వాని నట్లు బతిమాలెదు.

చ. ఎఱుఁగుము వాఁడు కృష్ణు జగదీడ్యత, సత్త్వపరాక్రమాదికం
బెఱుఁగక, నృపవర్గమ్మునకునెల్ల నసూయ జనింపఁజేసినన్
బోరిఁగొనవచ్చు నంచు మది బోలెఁడుకోరిక వాని కున్న, దీ
శ్వరుని త్రివిక్రమున్ జెనఁకువాఁ డెవఁ డీనరపాల పాళిలో ?
అంతటి దురదృష్టవంతుం డెవ్వండేనియున్న "సహేంద్రత
క్షక" న్యాయమ్ము ననుకరింతువు. నీవీ ఘోరమ్మున్యు నేల యనున
యించెదవు ? వీఁడు నీవంటివారి యనునయమ్ములకుం దగఁడు.
విరమింపుము.

శిశు — (పండ్లుగొఱుకుచు)

శా. ఏమో పేర్మిలెదు, సిరతానఁ జెదె నేఁ డీరాజసూయంబు; నీ
మోమోటమ్మునఁగాదె గొల్లని నొగిన్ బూజించె నీ తేఁడు; శౌ
ర్యామేయుల్ జగదేకధన్వులు యశోవంతుల్ ధరాకాంతు లీ
సామాన్యార్చకు సైఁచుటెట్లు ? లరరే ! చర్చించి వాకుత్తువే !

భీష్మ—(శిశుపాలుని కుత్తరమీఁబోఁగా)

సహ—(భీష్ముని సగౌరవముగావారించి) తాతా! యీపశుప్రాయునిగుఱించి
మీరించుకయుఁ బ్రత్యుత్తరమీకుంత నిదె మి మ్మభ్యర్థించెద, వీని
కింవగిన ప్రాయశ్చిత్తమ్మునకెల్ల మదీయ వామచరణమే పూఁట
వడియున్నది. (శిశుపాలు దిక్కు మొగమై మండిపడి)

మ. పరమాపాత్రశిరోమణీ ! త్రిజగతీవంద్యుండు కృష్ణుండు భూ
వరవర్గమ్మున నగ్రపూజ్యతకునై పాత్రుండుగాఁడేమి ! నా
చరణం బీనుడి పేర్మిలు నీకు నిపుడే సద్బుద్ధిచెప్పున్, శిరో
ధర మల్లంతన దీటి బాగుపడె గో వాచాటవారాగ్రిణీ !

( సభ్యులకెల్లఁ దన యెడమకాలిం జూపుచు )

శా. ఈ పొక్కుండవె కాదుసూ ! యిచట నింకేపార్థివుండేని యీ
శ్రీవాసార్చన మేవగించునొ, యిదే శీర్షంబు మద్వామపా
దావాసంబగు వాని దం చెఱుఁగు, మౌరా ! భీష్మునల్లంతవాఁ
"డేవం కార్య" మనన్ యజించితిమి, నీ వేపాటి ? మూర్ఖాగ్రణీ !

( తెరలో )

శా. మేలోహో ! కడుమేలు ! మేలు ! త్రిజగన్మిత్రుండవై తీవు, నిన్
బూలన్ బూజయొనర్ప వచ్చితి మిదే ; పూజార్హు దాశార్హు నీ
వాలోచించితి వృద్ధసమ్మతిగ, నీ కాయుర్యశోధీబల
శ్రీ లెల్లప్పుడు వృద్ధిఁజెందుత జగత్క్షేమంబు దైవారఁగన్.

(సహదేవునిపై పుష్పవృష్టిగురియును)

నారదుఁడు—(పటాక్షేపముగాఁ బ్రవేశించి)

ఉ. చక్కని కృత్యమున్ సలిపి జన్మము సార్థకమై ఫలించు స
త్ఫక్కిని ద్రొక్కితీవు కులవర్ధన ! యోసహదేవ ! శౌరికిన్
మ్రొక్కని కట్టిఁడుల్ జడులు, ముక్తిన నూఁపిరిగల్గియున్మృతుల్
నిక్కము చెప్పితిన్ వినుము, నీహరిభక్తికి సంతసించితిన్.

(నిష్క్రమించును)

ధర్మ—(తెరలోఁ గలకలము విని భీష్మనుద్దేశించి)

శా. తాతా ! కంటివె రాచమండలము మాద్యద్ధంతి సంతానవి
స్ఫీతంబై మఖవిఘ్నమున్ సలుపఁగాఁ బెన్క్రోతలన్ మ్రోగుచున్
దోతేనెంచెడిఁ జేదిభూమిపతికిన్ దోడౌచు; నేమందు వీ
వీత్రోనల మెట్లు శాంతిగనునో యిష్టే విచారింపవే !

చ. పిలిచినవచ్చి రెల్లపృథివీపతు; లందఱుఁ బూజనీయు ల
వ్వల శిశుపాలుహేతువున వైరముచేకుతె, వార లెంతగా
నలిగిన నాతిధేయులకు నల్గుటయుక్తముగాదు, శాంతికిన్
గలతెఱఁ గూహచేసి మఖకార్యసమాప్తికిఁ ద్రోవచూపవే !

భీష్మ—(నిర్లక్ష్యముగా)

ఉ. వింటిని జైద్యు నూతగొని వేదుఱులట్టులు ప్రేలుచున్న యా
తుంటరి రాచమండలపు దుర్వచనమ్ములు; కృష్ణసింహ మె

ష్పంటికి నిద్రమేల్కొనునొ వాగెడి నీభషకంబు లంత; కా
దంట యొకింత గర్జిలిన తత్క్షణమే సకలంబు తగ్గెడిన్.

శిశు—(సధైర్యస్మితముతో) ధర్మజా! నీతమ్ముఁడు పసివాఁడనియు నీతాత ముదుకండనియు నీ వెంత నోరుచేసికొన్నను మా మనమ్ములకంతగా నొప్పి తగులుటలేద. నీయందీ రాజలోకంబెల్ల స్నిగ్ధమ్మగుటకున్ గతంబు నీధర్మవర్తనంబ కాని, నీతమ్ముల బలపరాక్రమమ్ములుగావు; సకలరాజలోక విశ్వాస్యమ్మగు నీయోగ్యతాలతకీ భీష్ముండు వేఱుపురువై ముఖవిఘ్నమ్మాపాదించు చున్నవాఁడు. (భీష్ముని దిక్కై)

ఉ. ఏనొక బ్రహ్మచారినని యెంతయుఁ బొంగెదు, నీనపర్ణితా
ఖ్యానము షండతాప్రభవమంచుఁ దలంచెద మేము, ధర్మవి
జ్ఞానము దంభమాత్రి; మధికంబుగ విన్నను దూఱుచేల, వీ
వీనలినాక్షుఁ బూజ్యునిగ నేగతిఁ జెప్పితినాకుఁ జెప్పుమా!

(కేల నిర్దేశించి) ఆరాచమండలముం దిలకింపుము.

శా. అం దేరాచకొమారుఁ బోలగలఁ డీయబ్జాక్షుఁ డైశ్వర్యపున్
సందర్భమ్మున శౌర్యధైర్యగరిమన్ జాతుర్యసౌందర్య వి
ష్పందఖ్యాతివిశేషసంపదల; నప్రాజ్ఞుండవై యిందరన్
నిందింతే! కడు వృద్ధమూర్తి వవి మన్నింతేమి! భూపాలకుల్.

సీ. ద్రోణునికన్న నాద్రోణాత్మజునికన్న
దుర్యోధనునికన్న ద్రుపదుకన్న
కర్ణునికన్న నక్కాంభోజవిభుకన్న
భగదత్తుకన్న నప్పాండ్యుకన్న
భీష్మకుకన్న నవ్విరటుకన్నను మద్రి
పతికన్న సింధుభూపాలుకన్న
భూరిశ్రవునికన్న భూధరేశ్వరుకన్న
నేకలవ్యునికన్న నెవరికన్న

తే. గీ. మఱియు ద్వైపాయనునికన్న మహితశక్తి
పైన నీకన్న నాకన్న నన్యుకన్నఁ
గృష్ణుఁ డేపాటివాఁడని కెరలి యర్ఘ్య
మీయఁజేసితివోయి గాంగేయ ! నీవు

అది యటులుండె. ఇంతవఱ కీగోపాలుండొనర్చిన మహాకార్యము లెయ్యవి ? స్త్రీఘ్నుండును, గోఘ్నుండును, గృతఘ్నుండును నగు వాని కగ్రపూజ్యత యెట్టిది? ఇఁక వల్మీకమాత్రమ్మగు నగ మ్మెత్తుట కేవల పక్షపాతివగు నీకు నాశ్చర్యజనకమయ్యు బాహు బలాఢ్యులగు భూపాలుర కట్టిదికాదు. పైఁగా నీతఁడు లజ్జావిహీ నుండనుట కావంతయు సందియమ్ములేదు.

శా. నాకుం బత్నిగనీయనున్న నృపకన్యన్ దొంగయైకాదె ! మీ
శ్రీకృష్ణుండు గ్రహించె, నీజడునకున్ సిగ్గున్నదే ! యన్యకాం
తాకళ్యాణము లిచ్చగింతురె ? యశోధర్మస్పృహుల్ తేఁడు; లీ
వీకష్టుండెటు పూజ్యుఁ డంటి ? చెపుమా ! యీసభ్యులాలింపఁగన్.

మఱియు నీపిరికిపంద జగదేకవీరుఁడగు జరాసంధు వంచించి భీముచేఁ జంపించిన తెఱంగు శూరలోకదూరంబని నీవెఱుంగనిది కాదు, సర్వము నెఱింగి నీవీ నీతిబాహ్యునెట్లగ్రపూజ్యుఁడనిస్తుతించితి?

ఉ. బాలిశుడైన కృష్ణుని సభాజనమాన్యుని గాఁగఁ జెప్పి ల
జ్జాలవమేనిలేక కడుసజ్జనునింబలె ధర్మపన్నముల్
చాలవచించు నీచెడురసజ్ఞ తటాలున నింతలింతలై
చీలనిహేతువేమొ ! పరిశీలనఁజేసి వచింప నేర్తువే ?

భీము—(కనులెఱ్ఱఁజేసి మండిపడి)

మ. ఖర ! వాచాట ! రటద్వృథావదన ! నీకాలంబు దాపయ్యెనే
మిర! మూర్ఖాగ్రణీః యాపగాతనయు పేర్మిన్ నుంతలెక్కింప, వ
ధ్వరమూర్తిన్ జగదీడ్యుఁ గృష్ణునివృథా పాపమ్ములన్ గూసె దో
దురితాత్మా ; యిదె నీశిరమ్ము గదచేఁ ద్రుంచెదన్ గ్రేల్మిడిన్.

(లంఘించును)

భీష్మ—(అడ్డై పట్టుకొని) తండ్రీ! భీమసేన!

మ. విపులమ్ముల్ సహజారుణమ్ములు రుడావేశమ్ముకల్మిన్ దప
త్తపనప్రాయమ్ములై భవన్నయనముల్ ధైర్యమ్ము మాయించు నే
రిపుభూపాలునకేని; వీఁడన గత వ్రీడుండు నిర్భీకుఁ డే
విపరీతోక్తులొ పేర్లుఁగాని నయమున్ వీక్షింపఁ డక్షాంతిమై.

ఉ. వీఁడు పరాక్రమమ్మునను బెద్దయుఁ బేర్కొనఁదగ్గవాఁడు, నీ
వాఁడి మగంటిమిన్ జెడనివై ఖరి కన్యనిమిత్తమున్నదా
జాడయెఱుంగఁ జెప్పెదను; శాంతివహింపుము మిన్నకుండు, మీ
గాడిదనంటి దేహమును గశ్మలమున్ బొనరించుటర్హమే!

శిశు—(నిర్లక్ష్యముగా) తాతా! రానిమ్ము, నివారింపకుము.

చ. ముదుకఁడవీవు, వాయుజుఁడు ముష్కరుఁ డించుక యస్మదీయదో
ర్మదము నెఱుంగుగాక, వెస మామకశౌర్య దవానలంబునన్
గదయును దానునున్ మిడుతకై వడి క్రమందుసుగాక, యాఁగఁబో,
కెద మఱి వాని కెంతటి యభీప్సితమున్నదొ! వీడు, చూచెదన్.

భీము—(భీష్మనియాజ్ఞపై రోజుచునిల్చును.)

భీష్మ—

శా. ఈకష్టాత్ముఁడు వీగదం జెడఁడు. లోకేశుండు కృష్ణుండు ప
ద్మాకాంతుం డగు మారకుండని మదిన్ దర్కించు, మప్పాట ము
న్నాకాశోక్తి స్థిరీకరించె, సమయంబయ్యెన్ బడున్ వీఁడు తా
నాకంజాక్షు సుదర్శనంబున శిరం బామూలమున్ ద్రెళ్ళఁగన్.

వీఁడు చతుర్భుజుండును త్రిలోచనుండునై పుట్టి రాసభంబుంబలె వార్చిన నావికృత స్వరమ్మునకు శంకించి తల్లిదండ్రులు విచారించుచుండ నంబరవాణి యుపశమనవాక్యమ్ములు చెప్పి "వీఁడు బలాఢ్యుండును శూరుండును, ననన్యసాధ్యుండును నగు" ననియు 'వీఁ డెవ్వని యుత్సంగమ్మునఁ గూర్చుండునెడల వీ వికృతస్వరూపమ్ము వదలి సామాన్యమనుజాకారమ్ము నందునో? వాఁడ వీనికి

మృత్యువగు'' ననియుం జెప్పఁడు 'వాఁడెవ్వండగునొకొ' యని కనవచ్చిన రాజుల యుత్సంగమ్ములందెల్ల వీనినిం గూర్చుండఁ బెట్టుచుఁ దల్లి పరిశీలించుచుండునెడలఁ దన మేనత్త కొమరుఁ డగు వీనింజూడ నొకపరి శౌరి యేతెంచెను. అంత యథాపూర్వ మ్మౌగ నీతని నాతని యుత్సంగమున నిడుటయు, విషమలోచనం బును సఖ్యధిక బాహుద్వయమ్ము ను బోయి వీని యిప్పటి యా రూపంబు నిలిచె; నదికాంచి తల్లి శ్రీకృష్ణుని వరమ్ముకోరి వీని వధింపకుండ ననుగ్రహింపు మనుటయు, నాపరమం డపరాధ శతాచరణమ్ము మిత్రిగా నావరంబనుగ్రహించె. ఆయపరాధమ్ములు నిండె; నింకవీనివధియించుటయ కడమ, కావున నీవుశాంతింపుము.

శా. నీకన్నన్ బలియుండుగాఁ, డయిన నీసీచుండు నీపైపైబుల్
శ్రీకృష్ణుండిడు నావరమ్ముకతనన్ జేసాచుచున్నాఁడు; నీ
వీకాలమ్మున శాంతిచూపు. మతఁడే యీదుష్టు శిక్షించు, దు
ష్పాకుల్ వీనికిఁ దోడుసూపు నృపతుల్ వాపోయి గూర్పెట్టఁగన్

శిశు—(వికృతస్మితముతో)

ఉ. తాతయు మన్మఁడున్ బుజావిధమ్మున శాంతినిగొంటిరే ముఖ
పీత్రితులు గొణ్గికొంచు, రిపువీరులు నవ్వఁగ; మేలు! మేలు! సీ!
కాతరులార! మీబ్రతుకు కాల్పనె! (భీష్మునిమాత్రమే కేల నిర్దే
శించుచు) భీమునిమాట కేమి, నీ
వాతికి బుద్ధిచెప్పి పశువై ఖరి నిన్ను వధించు టొప్పెడిన్.

(తెరలో)

ఉ. మంచిగఁ జెప్పితీవు మతిమంతుఁడ, వీనదిసూనుఁ డెంతయున్
జంచలబుద్ధియై పలికె, శౌరికి "నగ్రసపర్య సేయు" మం
చంచితుఁజేసె ధర్మజుఁ డనర్హుని గృష్ణుని గొల్లబోయ, నీ
వంచకు భీష్ముఁబట్టి పశువై ఖరిఁజంపుట కర్జ మెమ్మెయిన్
(సింహనాదము లొనర్తురు)

భీష్మ—(విసుట నటించి గంభీరకోపముతో)

శా. ఓరీ రాజకులాధముల్ ! పలికినట్లోలిన్ ననుంబట్టి కొ్రి
వ్వాటం జంపుఁడు; లెండు, మీశిరములం దారూఢి మత్పాద మొ
ప్పార న్నిల్పితి నేల యోర్చెదరు ! రండా ! ఖండనోద్యుక్తులై
ఘోరత్వమ్ములు సూపి రాజకుల విస్ఫూర్తిన్ బ్రివర్తింపుఁడీ !

(శిశుపాలుని దిక్కై)

శా. ఓయీ ! మూర్ఖ ! జఘన్య! నీయజచు నీచోక్తుల్ చెవుల్ సొచ్చియు
న్నీయుదేక్రికముమాన్ప శాంతనవుఁ డింతేనిం బ్రియత్నింపఁ, డా
మ్నాయధ్యేయుఁడు నందనందనుఁడు నిన్ ఖండింపఁగా బుట్టినాఁ
డాయజ్ఞేశ్వరుఁ జేరి పోరి చారుమా! యద్దేవు తేజమ్మునన్

క. హరియై హిరణ్యకశిపున్
హరిణముబలె నడఁచె, నరవరాకారమునన్
బొరిఁగొనె రావణు నెవఁ, డా
పరమేశుఁడు శౌరినిన్నుఁ బట్టి వధించున్.

(తెరవంకఁ దిరిగి)

ఓహో ! స్వశక్తిపరశక్తి జ్ఞానశూన్యులగునోరాజన్యకీటకములారా!

శా. మీలోనేరికిఁ జావు దాపగునొ వార్ మీ గ్గాలముంబోలె గో
పాలున్ జేరి పరాక్రిమింపుఁడొగి, జీవభ్రాంతి సుంతేనియున్
వాలాయమ్ముగనున్న రాకొమరు లావై పేని వీక్షింపకుం
డోలిన్ దెల్పితిఁగృష్ణమార్గానిన నాయుర్భాగ్యముల్ రూపఱున్.

శిశు—(సాధిక్షేపముగా) తాతా ! యిటుచూడుము.

చ. పొగడెదు సారెకున్ హరిని బూతువిధానఁ, బొగడ్తకర్హులై
నెగడెడు రాజులుండ, నవనీపతి గాని యనాథునింతగాఁ
బొగడెద వేటికో ! ముదుకబుద్ధికిఁ గర్జములెల్లు టోఁచు మేల్
మగఁటిమి గల్గెనేనినను మార్కొనఁ డేటికిఁ గృష్ణుఁ డిమ్మెయిన్.

(తెరవంకఁ దిరిగి బిగ్గరగా)

ఆ. వె. రాఁగదోయి బావ! రారమ్ము, నిన్నుఁ బాం
డవులతో వధింతు నవసిపతుఁ
మెచ్చిపొగడ; నర్ఘ్యమిచ్చినందుకు వారి
కిపుడు ఫలముగల్గు దెలుకపడఁగ.

శ్రీకృష్ణుఁడు—(ప్రవేశించి తనలో)

క. అపరాధశతము సైఁచి శి
శుపాలు వధియింతు ననుచు సూనృతగతి నీ
కపటాత్మతల్లి కిచ్చితి
నపుడు వరము, శతము నింత కయ్యెన్ హొసఁగుల్.

ఇపుడు నూటొకటవ యపరాధమ్మున కీఁతఁడుం దారంభించె. జగ
ద్ద్రోహవ్రత పరాయణుండగు నివ్వాని నిఁక సైఁచుట పాడిగాదు.
(రాజుల నుద్దేశించి ప్రకాశముగా)

ఉ. ద్వారకగాల్చె, బభ్రుప్రమదన్ హరియించెను, గట్టిపెట్టె నీ
ధీరహితుండు మున్ను వసుదేవుని యాగతురంగమంబు, దు
ర్వారము లెన్నియేని యపరాధము లిట్టివి సల్పె; వీనిపైఁ
గారణముంటఁజేసి యలుగన్; వర మట్టిది తల్లికిచ్చితిన్.

ఉ. ఆవరవర్ణనీమణికి నప్పుడొసంగితి నావరమ్ము; నీ
కావరుఁడా వరమ్మునకుఁ గల్గఁగఁజేనె నపార్థకత్వ; మిం
కేవరుసన్ క్షమింపవలె నీచెనఁటిన్; నృపులెల్లడుం గనం
గావలమార్చి భూజనుల కష్టము వాయఁగఁ జేయుటొప్పదే?

(తెరలో)

ఉ. నందకుమార! "మేల్, బళి" యనందగుపల్కు వచించి తీవు, ని
న్నందురె! యోగ్యులైన నృపు; లధ్వరమూర్తిని వీఁడు వీనితోఁ
గొందఱు దుర్మదుల్ గలిసి కూసిరి కూళతనంపుఁగూత; లీ
తుందుడుకున్ హరించు టది దోసముగాదుసుమీ రమాధవా!

కృష్ణు—(తనలో)ఇవిప్రాజ్ఞులగు రాజర్షుల పలుకులు వృద్ధసమ్మతమ్ముగ
నిఁక నివ్వాని వధించెదగాక. (ఆకాశమువంక దృష్టినిగిడ్చి)

ఉ. రమ్మిటు చక్రరాజమ ! పరాక్రమగర్వితుఁడైన చైద్యుమూ
ర్థమ్ము హరించి వేగ నిజధామము చేరుము, పార్థివరాజలో
కమ్మునకున్ ముదమ్మగుతఁ, గశ్మలభూధపజాతికెల్ల దుః
ఖమ్ము ఘటిల్లుఁగాక, మఖకార్యము నెగ్గుతఁ బూర్ణకామమై.
(చక్రమువచ్చి శ్రీకృష్ణుని హస్తమున నిల్చును)

శిశు—(అధిక్షేపముగా)

ఉ. చక్రము గిక్రమున్గని వెసన్ భయమందెడి వాఁడఁ గాను, నీ
వక్రతమాన్ప సిద్ధపడివచ్చితి, భీష్మునిమాట పొల్లుగా
సక్రమభంగి నాలమున శౌర్యముచూపి వధింతు నిన్ను; నీ
విక్రమమున్ గనంబఱుచు వేళ యిదే, తడవేల చేసెదో !

కృష్ణుడు—(శిశుపాలుని దిక్కైృ)

చ. అలతఱి రుక్మిణీరమణినట్లు వరించెడినాఁడు నీదు దో
ర్బలమఱజేసి శీర్షపుభరమ్ముఁడిగింపమి నీకు దుర్మ దా
విలత కడుంగడుం బెరిఁగె వేఁదుఋపట్టిన వానిపోల్కి నో
తులువ ! చెడంగఁ బ్రేలెదవె ! దుండగపుంజెడుకూఁత లేడ్తెఱన్.

శిశు—(తొందరగా)

శా. నీకున్ సిగ్గు లవమ్ముసుంగలదె ! మన్నీలున్న యిచ్చోట ము
న్నాకీనెంచిన రుక్మిణీరమణి విన్నాణెంపుఁ బెండ్లిన్ వచిం
తే! కొంకింతయు లేక; నాఁడె నిను మ్రందింపన్ బ్రయత్నించితిం
గా కెట్లో బ్రతుకంగ నేర్చితి,పు డక్కార్యమ్ము పూరించెదన్.

కృష్ణ—(బిగ్గరగా)

చ. కనుఁడు నృపాలకుల్ ! కనుఁడు కశ్మలచిత్తుని మీరలెల్లరున్
గనుఁగొనుచుండఁ జంపెద, నిఁక౯ సయిపంబనిలేద; నన్నువీఁ
డనుటకుఁగాదు, భీష్ముని మహామహు దూఱినదానికిన్ ఫలం
బును గనుఁగాక, దుర్మదుల బుద్ధివిహీనత లింకుఁగావుతన్ !
(చక్రమును బ్రయోగించును—తెర దింపుదురు)

నందికేశ్వరుఁడు—(ప్రవేశించి)

(భరతవాక్యము)

మ. మొఱకుల్ పూజ్యులపై నసూయగొని యున్మూలమ్ముగాకుంద్రఁగా
కరుబుద్ధుల్ కడువృష్టు లాడు పలుకుల్ యోచించి త్రైకొంద్రుగా
ని, రహస్యూఖ ప్రసంగముల్ జరిపి వస్నేస్దన్కే చాకుంద్రుగా!
కరవిందాసను రాణి తా నిలుచుఁగా కన్మన్మనఃపీఠికన్.

(అందఱును నిష్క్రమింతురు)

గద్య

ఇది శ్రీ........తిరుపతి వేంకటీయమ్మగు పాండవ
రాజసూయమ్మను నపూర్వ నాటకమ్మునందు
సర్వమ్మును బ్రథమాంకము.

—• ఫలశ్రుతి •—

మ. ఇటు ప్రత్యక్ష మెసర్చునంత యురగం బిట్లొటకున్ గొంకి యా
కటువాగ్ధోరణి కట్టిపెట్టి యటుపైఁ గంజాక్షు పాదార్చనా
ఘటనాతత్పరులైన వారల గతిన్ గాంక్షించి తత్పద్ధతి
స్ఫుటరేఖాకలితోత్తమాంగమగుచున్ బొల్పారె నాకల్పమున్.

—•—

# ముఖ్యమైన సవరణలు

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 4 | 24 | వత్ప | వత్స |
| 7 | 4 | నింం | నిం |
| 7 | 14 | వచా | వచో |
| 8 | 20 | ర్భో | ర్పో |
| 10 | 3 | నాల | వాల |
| 10 | 21 | డొక్క | డొక్కా |
| 20 | 11 | ష్క | ష్క |

శ్రీ తిరుపతి వేంకటకవులచే రచింపబడిన

# * గీరతము *

ఇదియొక మహా కోలాహలమును సృజించిన అత్యద్భుత గాధ, వెంకటరామకృష్ణకవులకును తిరుపతి వెంకటకవులకును - యథార్థవిషయ నిర్ధారణకై జరిగిన-గురుశిష్యత్వములకు సంబంధించిన వ్యవహారము-తుట్ట తుదకీ గ్రంథరూపంలో శాశ్వతమై నిల్చినది-ఇందు ప్రత్యక్షరమున్నూ సత్యాన్వేషణలో మానవునికి ప్రామాణిక స్వభావాన్ని బోధిస్తుంది-ఇది నాలుగుభాగములు, నాలుగవభాగాంతంలో-గ్రథానుబంధముగా 1918 సం॥లో రచించి కృష్ణాపత్రికలో ప్రచురించిన-తి॥ వెం॥ కవుల క్షమాపణ వ్యాసము లను గూడ చేర్చి మేము పాఠకుల కందించినాము. ఈ వ్యాసాలు-"ఆంధ్ర కవులఅపరాధములు" అనే వెంకటరామకృష్ణకవుల వ్యాసములుదోషజుష్టము లని నిర్ధారణచేస్తో, తమశిష్యులుచేసిన యీ మడుకు తనమునకులోకంవారిని క్షమించవలసిందిగా శిష్యులతరఫున తాము (తి॥ వెం॥ కవులు) లోకానికి క్షమాపణ చెప్పుటఇందుగమనీయాంశము. మొత్తం వెల రూ 6-8-0 లు. ఖర్చులు ప్రత్యేకము.

# తిరుపతి వేంకటేశ్వరులొనర్చిన తెనుగు పుస్తకములు

### —: లఘుకావ్యములు :—

| | రు. | అ. | పై. |
|---|---|---|---|
| వ్రతకథలు | 2 | 0 | 0 |
| పురాణగాథలు | 2 | 0 | 0 |
| రసికానందము | 0 | 3 | 0 |
| శనిగ్రహము | 0 | 3 | 0 |
| గ్రామసింహము | 0 | 4 | 0 |
| బిడాలోపాఖ్యానము | 0 | 4 | 0 |
| వైరాగ్యశతకము | 0 | 4 | 0 |
| దైవతంత్రము | 0 | 6 | 0 |
| శుకరంభాసంవాదము | 0 | 8 | 0 |
| కాశీ సహస్రమ్ (సంస్కృతం) | 0 | 12 | 0 |
| ధాతురత్నాకరమ్ | 2 | 0 | 0 |

### —: శతకములు :—

| | రు. | అ. | పై. |
|---|---|---|---|
| కామేశ్వరీ శతకము | 0 | 4 | 0 |
| ఆరోగ్య కామేశ్వరి | 0 | 4 | 0 |
| సౌభాగ్య కామేశ్వరి 1 భా॥ | 1 | 0 | 0 |
| (2–3భాగములు) | 2 | 0 | 0 |
| ఆరోగ్య భాస్కర స్తవము | 0 | 4 | 0 |
| మృత్యుంజయ స్తవము | 0 | 4 | 0 |
| నమశ్శివాయ స్తోత్రము | 0 | 8 | 0 |
| శివ స్తవము | 0 | 12 | 0 |
| కాశికాది స్తోత్రమాల | 0 | 12 | 0 |

### —• చాటువులు •—

| | రు. | అ. | పై. |
|---|---|---|---|
| నానారాజ సందర్శనము | 4 | 0 | 0 |
| కలగూరగంప | 1 | 8 | 0 |
| శతావధాన సారము | 2 | 0 | 0 |

### —• వచనములు •—

| | రు. | అ. | పై. |
|---|---|---|---|
| కథలు—గాథలు 1–2–3–4.సంపుటములు | 5 | 0 | 0 |
| హర్షచరిత్రము | 1 | 0 | 0 |
| చంద్రప్రభ చరిత్రము | 1 | 8 | 0 |
| విక్రమాంకదేవ చరిత్రము | 1 | 8 | 0 |
| సారస్వత విమర్శలు (1–2–భాగములు) | 10 | 0 | 0 |
| కాశీయాత్ర | 0 | 6 | 0 |
| విక్రమ చెల్లపిల్ల | 0 | 8 | 0 |
| షష్టిపూర్తి | 0 | 8 | 0 |
| సతీజాతకము | | | |
| దివాకరాస్తమయము | 0 | 12 | 0 |
| భారతవీరులు | 0 | 6 | 0 |
| ఆంధ్రభోజుఁడననేమి ? | 0 | 4 | 0 |
| పూర్వశాపంతల విమర్శనము | 0 | 10 | 0 |

### —• పరిశిష్టములు •—

| | రు. | అ. | పై. |
|---|---|---|---|
| శ్రీ శివశంకర విజ్ఞప్తి | 0 | 8 | 0 |
| దివ్యతిరుపతి | 0 | 8 | 0 |
| రాసభ కుమారుఁడు | 0 | 8 | 0 |


## చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి సన్సు

వేంకటేశ్వర పబ్లికేషన్సు

కడియం P.O. తూ॥గో॥జిల్లా.

శ్రీ తిరుపతి వేంకటకవులచే రచింపబడిన

# సుకన్య

అను నాటకము శ్రీమద్దేవి భాగవతము అను పురాణమునందలి కథ
నసుసరించి అయిదంకములుగల చిన్న నాటకముగా రచింపబడి
నది. ఇందు చ్యవన మహర్షి కథానాయకుఁడు. సుకన్యయను
రాచకూతురు నాయకురాలు, చ్యవనప్రాశ రసాయనమే
విధముగా భూలోకమున కవతరించినదీ ఇందు తెలి
యును దేవ వైద్యులగు అశ్వినీ దేవతలకు అంత
క్రితము లేని సోమపానము యజ్ఞాదులలో
మరల నేర్పరచినవాఁడు చ్యవనుఁడే అని
యిందులో తెలియగలదు.

వెల — రు 0—8—0



చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి అండ్ సన్సు
వేంకటేశ్వర పబ్లికేషన్సు
కడియం. P.O. తూర్పుగోదావరిజిల్లా.

వేంకటేశ్వర ప్రింటింగు ప్రెస్, ఆలమూరు, తూ. గో జిల్లా.